# సో ది.

ఉన్నవ లక్ష్మీనారాయణపంతులు.

**1933.**

---

గుంటూరు యింపీరియల్ ప్రింటింగ్ వర్క్సు వారిచే
ముద్రింపబడినది



వెల రు. **0–1–0.**

సింగి:—పో — ఆసందులో ఆమెకు చెప్పా. ఇల్లీ గొందిలో ఈమెకు జెప్పా. ఆనడివీధిలోఆమెకు జెప్పా. ఆ బొడ్రాతికాడి ఆమెకు జెప్పా. ఓ ఆబాయికాడామెకు జెప్పా. దేముడు చాలా మేలుచేస్తే ఆసీకిరికండ్లామెకు జెప్పా. మరే మండాగాని ఆముండమోపామెకు చెప్పా. ఇదుగో ఆసాయిబును తీసుకొని లేచివచ్చినామెకు జెప్పా.

స్త్రీ:— సరె-సరే — మంచి వాండ్లకే చెప్పావు. అంతా ఘరానా ఆసాములే.

సింగి:— ఇనుథల్లె — పేరుబోయిన వాండ్లకే జెప్పా. అయిగోద్దెలో సీతమ్మకు జెప్పినా. సచ్చబామకు చెప్పా. అల్లకడ రాధమ్మకు చెప్పా. సెన్నాపట్నంలో తిలకమ్మకు సెప్పినా. గిక్కడ నెల్లూరులో కనకమ్మకు జెప్పినా. గిక్కడ సేబోల్లో పార్వతెమ్మకు సెప్పినా. వున్నవలచ్చమ్మకు-దువ్వూరి సుబ్బమ్మకూ-ఏలూర్లో సుక్కమ్మకూ సెప్పినా. గీళ్ళందరికి కద్దరుపోగుసుట్టిఅంత్రంగట్టినా. ఇప్పుడుకద్దరె కట్టుకుంటుండరు.

స్త్రీ:—ఖద్దరుపోగు చుట్టావు? ఆపోగులో మహిమ వున్నదా ఏమి?

సింగి:— ఆఁ — మరేమనుకుంథవు. దేవరకుమొక్కి అంత్రానికి కద్దరుపోగులు, నలుపు, ఎరుపు, తెలుపు మెలిపి మూడుసుట్లు సుట్టి, దండసేతికి కట్టేతలికి ఈళ్ళంతా శివాలు పెరిగి ఇళ్ళు వాకిళ్ళు వదలి దేశమ్మకాకులై కేగల్లోఅని తిరుగుతుండరు.

స్త్రీ:—సరే బాగానేవుంది. మంచి యంత్రాలే కటు తున్నావుగాని కూచో. మన్ములనుమట్టుకు సన్నాసులను చేయబాకు.

సింగి:—నీకేమమ్మా మారాజువు. పెట్టిపుట్టిన తల్లివి. లోకాలన్నీ పాడయినా నీవుగడపదాటవు. నీయిల్లేమో, బిడ్డ లేమోతప్ప లోకం నీకు పట్టదు. బీర పూసినట్టు నగలు పెట్టుకొని కూకుంటవు.

స్త్రీ:—సరే, ఏమియ్యమంటావు చెప్పు.

సింగి:— ఓయమ్మ—ఏమి స్తవు—నాకేమి మేడలిస్తవా మాడలిస్తవా—అమ్మోరిముడుపుకు మూడుపావలాలు రొక్క—మియ్యి. గద్దెకింద మానెడుసోలెడు బియ్యంబొయ్యి. సింగికి నీవు కట్టిడిసిన దాపుడుకోకియ్యి. అప్పుడు శివంబెరిగి వున్న దున్నట్టు లేనిది లేనట్టు సెప్త.

స్త్రీ:—సరే ఈవరాలకేమిగాని ఏమియ్యమంటావో ఖరాగా చెప్పు.

సింగి:— నీసొమ్ము నాకేమీవద్దు. నీసెమట మాసిన పాత రేకె ఒకటియ్యి. దొరచోని పేరుయెల్లకాలం సెప్పుకుంటా తొడుక్కుంటా.

స్త్రీ:— నీవుచెప్పటం కానీ ముందు.

సింగి:— సెప్పినాఖనే యియ్యి. అనుకున్నేది అను కున్నట్టు వత్తేనేయియ్యి నాతల్లి.

స్త్రీ:— అంతా నిజంచెప్పు యిస్తా.

సింగి:—నేసెప్తానంరమ్మా. అంతా అమ్మోరే సెప్తాద్ది. ఇదుగో దొరసానెమ్మా—నీకడుపు సల్లంగ—ముందింత ముద్ద పెట్టమ్మా. కడుపు మాడిపోతుంథది.

స్త్రీ:— ముందుచెప్పడంకానియ్యి.

సింగి:—సరె కూఛోమ్మ—ఎంతభోకొట్టినా పెట్టబెదిరి పోతుంథది. దొరసానికి నేబాగ సెప్పనేమోనని బయ్యం. ఆనిఖె అడిగిందానికంటె ఎక్కువే ఇస్తది. కూకో సెయ్యిచ్చి దండంబెట్టుకో అమ్మోరికి.

ఓయమ్మా, కొల్లాపురి యెంఖమ్మ, ఏడుగొండలవాడ, ఎంకటేచర్ల, అంకమ్మథల్లి, పలికి బొంకవద్దు. ఆడితప్పవద్దు. పలికి బొంఖవద్దే మాలమ్మా! మాలకొండలసామీ, యేడుగొండలవాడా, పార్వతీపరమేచరా, మంగళగిరి నరిసిములా, పెదఓబళయ్య, బెజవాడ కనకదురగమ్మ, కొల్లాపురెమ్మ, లోకాన యెలిసిన నూటొక్కసత్తుల్లారా! గుంటూరు మథానయ్యా ఆడితప్పవద్దు—పలికిబొంకవద్దు. ఉండదుండట్టు, లేనిది లేనట్టు—చెప్పవే అమ్మా. నీవు దయ్యానివో, భూతానివో సెప్పవే తల్లీ. నేను దయ్యాన్నిగాను, బూతాన్నిగాను, పీడనుగాను, పిసాసినిగాను, యేడుగొండలు వాణ్ని గాను

ఎంకటేచన్లనుగాను, ఓబళయ్యనుగాను, మంగళగిరి నరిసిము లునుగాను, యల్లమంద కోటయ్యనుగాను—

స్త్రీ:— మరెవరు నీవు?

సింగి:—నేను యెవరినో చెప్పమంటవంటే తల్లీ.

స్త్రీ:—చెప్పమటే – చల్లకొచ్చి ముంతదాచుకోవట మెందుకు ?

సింగి:—సెప్పబోతే సిగ్గాతదే తల్లి.

స్త్రీ:—సిగ్గయితే యెందుకొచ్చావు? మనసూ సిగ్గూ గూడ అయితే యెట్లా? బయటపడు.

సింగి:— నేను సెడి బతికినదాన్ని గానే – బతికిచెడ్డ దాన్నేనేతల్లి. నేను పుట్టేవాండ్లకు అప్పను–పెరిగేవాండ్లకు చెల్లెలిని అయిపోయినానే తల్లీ.

స్త్రీ:—చెప్పుకో మరి.

సింగి:—సెప్త యినవే తల్లీ. సెప్పకుండ పోతానంటె మాఅమ్మ నాకు ఆవేదన పుడుతున్నదే మాఅమ్మా. కడుపు మండిపోతుంథదేతల్లీ.

స్త్రీ:—చెప్పుకో?

సింగి:—నేను దేశమ్మనే తల్లి. నేను పరువుగల దాన్నేనే తల్లి. నలుగురిలో మొగమెత్తుకోవడానికే లేకుండా పోయిందేతల్లి. నాబతుకు ముండ ముత్తయిదు కాకుండా పోయిందేతల్లి. నాకు ఆవేదన ఎక్కువయిందేతల్లి.

స్త్రీ:—ఎందుకు అవేదన.

సింగి:— నాకు వల్లమాలిన పిసాసి బట్టిందే మా అమ్మా.

స్త్రీ:—ఇందాక పిసాసివి కాదంటివి?

సింగి:— నేను దేశమ్మ తల్లినే మాఅమ్మ. నాకు పిసాసి పూనిందే తల్లి.

స్త్రీ:— ఎక్కడనుంచి వచ్చింది.

సింగి:— ఒక్కటి-రొండు—మూడు—మూడంటె తెలియదంటే మాతల్లి. మూడోదిక్కునుంచి వచ్చిందే మాతల్లి. పడమటినుంచి వచ్చిందే మాఅమ్మా. పడమటిగాలి సోకిందే మాతల్లి. పీల్చి పిప్పిజేసిందే మాఅమ్మా. వడగొట్టి పడగొట్టిందేతల్లీ. చిల్లరదుకాణంపెట్టి పెద్దసెట్టయిందే అమ్మా. అడుగుపెట్టనిస్తే అంతా చేముకున్నదే తల్లీ. పీనుగలాగొచ్చి ఏనుగలాగయిందే మాఅమ్మా.

స్త్రీ:— ఏనుగలాగ ఏముంది.

సింగి:—తెలియకపోతే తెలుపుతానుయినవే మాఅమ్మ. దబ్బకర్రలాగొచ్చి దుబ్బనాగుఅయిందే మాతల్లీ.

స్త్రీ:—దుబ్బనాగేమిటి?

సింగి:—తెలియజెప్తుతా యినవే మాయమ్మా. ఏయి చిరచుల దుబ్బనాగయిందే మాఅమ్మా. దుబ్బనాగంటే తెలియదంటే నీకూ. ఏయిపడిగెల పాముయిందే మాఅమ్మా.

దుబ్బనాగంటె రెండునాలికల పామే మాఅమ్మా. దుబ్బ నాగంటే సుబ్బనాగే మాతల్లి.

స్త్రీ:—ఓహో! సుబ్రహ్మణ్యస్వామా. నల్లతాచు ముట్టుకున్నదా?

సింగి:— కాదు. తెల్లతాచేనే మాఅమ్మా. రావు కంటె లావే మాఅమ్మా. కేతుకంటె యినమే తల్లో. కట్టు కట్టుకు తలకెక్కిందే తల్లి.

స్త్రీ:—ఏమిచేసిందది?

సింగి:—ఏమి చేసిందా. పస్తైలడుగుతది మాతల్లి పస్తైలు చెప్పతినుకోవే మాతల్లి. నాబిడ్డలకూ నాకూఎడలుబాపిందే మాఅమ్మా. పిల్లిమీద ఎలుకను ఎలుకమీద పిల్లిని ఎక్కించిందే మాతల్లి. జుట్టుజుట్టుముడిపెట్టిందే మాఅమ్మ. తాటి మట్టలుగట్టి ముట్టించిందే మాతల్లి అందరికి పిచ్చెత్తించిందే తల్లీ. అందరికి కైపెక్కించిందేతల్లీ. రాజులందరినీ తరాజులను జేసిందే. నవాబులందరిని కవాబులను జేసిందే. తనసదువులు చెప్పి బుద్దులు చెరిచిందే. అందరి మతులు యిరిసేసిందో తల్లో, అందరినీ మోహాములో పడవేసిందే. అందరిని నిద్దర బుచ్చిందే తల్లీ. అందరిమీద మచ్చుజల్లిందే అమ్మా.

స్త్రీ:—మచ్చుజల్లి ఏంజేసింది.

సింగి:— అందరూ నన్నొదిలి దానిపట్టయినారే తల్లీ. డిబ్బేలు నింపుకోని ఓడలెక్కించిందే తల్లీ. అందరినీ సన్నాసులను చేసిందే తల్లీ. అందరికి చిప్పలు చేతికొచ్చినవే తల్లీ. దేశమ్మకాకులై పోయినారే తల్లో. కేగర్లొఅంటూపోయి పడిపంచలు చేరారె తల్లీ. అంతా దిక్కూదెస లేనివాండ్లయి పోయినారె తల్లి. నీచపు బతుకులకు లోనయినారె తల్లి. ఇంకేమిచెప్పనే నాతల్లీ. చీమలదోమలకంటె కనాకష్టమయి నారేతల్లీ బతికీచచ్చిన వాండ్లకిందనే లెక్కతల్లీ. ఇంత కంటె వాండ్లంతా చచ్చినా సంతోషించేదాన్నె నేతల్లీ, ఒక్క యేతుపు ఏడిచి వూరుకుండేదాన్నె నే తల్లి.

స్త్రీ:— ఎవరిని చెడగొట్టుతున్నది ?

సిం:—తల్లి వస్తేడుగుతది, ఎవరిని చెడగొడుతున్నదని? ఇనుకోవే చెపుతాను మా తల్లె. ఎవరిని చేసిందే తెలియదంతే నీకూ, నా శర్దగల తండ్లందరినీ సన్నాసులను జేసిందేతల్లి— అన్నివిదాల చెడగొట్టిందే మాఅమ్మ.

స్త్రీ:— నీ శ్రద్ధగలవాండ్లెవరు?

సిం:— రాజులా రంభలా అని అడుగుతవంటే తల్లి. నోట్ట జూపితే రంభలనీ గెడ్డముజూపితే రాజులనీ తెలియదంటే నీకూ, రంబలంటే బుర్రక్కలనీ రాజులంటే పోతులనీ ఎరగ వంటే అమ్మా ?

స్త్రీ:— ఇట్లా చేస్తుంటె నీశ్రద్ధగలవాండ్లంతా ఏమి చేస్తున్నారు?

సిం:— నాబిడ్డలంతా కుడుము చేతికిస్తె పండగను కూడేవాండ్లే తల్లి—అందరూ మత్తులో పడిపోయినారే తల్లీ— కత్తులు పారేయించి కలంపుల్లలు బట్టించిందే. ముతగగుడ్డలు మానేయించి మాయగుడ్డల గట్టించిందే. వేరుసెనగ బెట్టించి బువ్వకు కరువు జేయించిందే. బువ్వలేక బిడ్డలు మల మల మాడుతుండారే అమ్మా. బిడ్డలంతా జానిచలయిరే తల్లీ. ఎక్కడికిబోయినా మొగాన వూత్తుండరె తల్లీ. నేసి చర బల్లేనే తల్లి, నన్నిడిపిచ్చే వాళ్లెవరూ లేరే మాఅమ్మా. నాఃబదవలు తప్పించేవాండ్లెవరూలేరే మాఅమ్మా. ఓసూరె చందుల్లారా, ఓసుక్కల్లారా, ఓకొల్లాపురెమ్మా, ఓయేడు గొండలవాడా ఈసెర నేపడలేనోతల్లో, యీసెను నేను అను బోగిచ్చలేనో తల్లో.

స్త్రీ:—నీబిడ్డలు నిన్నిడిపించరూ?

సింగి:—ఏమని చెప్పకుండేదే అమ్మా. చెప్ప వెరుతునా, చెప్పక వెరుతునే తల్లీ. కడుపు చించుకుంటే కాళ్ళ మీద పడద్దేతల్లి. నాబిడ్డలు వొట్టి నవటు పెద్దమ్మలే అమ్మా. చమురుకాళ్ళ పెద్దమ్మలే తల్లి. కడుపు చెడబుట్టారేఅమ్మా. చెట్టుచెడుకాలానికి కుక్కమూతి పిందెలు పుట్టినవే తల్లి. నా బిడ్డలు నల్లుబకంటె నాలీసేతల్లో. బతికుంటే బలుసాకయినా

తింటామంటారే అమ్మా. బానిసత్వమే బాగుంటుందంటారె తల్లో. కాసాబతుకే కమ్మంగుంటదంటారె అమ్మా. సన్న గుడ్డలోళ్ళు, బొంరకడుపులోళ్ళు, దానియిద్దెలు నేర్చినోళ్ళు అంతా దుబ్బనాగులేనే మాఅమ్మా. బోడిగుండ్లోళ్ళు బొట్టులేనోండ్లు దుబ్బనాగులేనే అమ్మా. టాకుటీకులోళ్ళు పక్కపాపిటిలోళ్ళు అంతా దుబ్బనాగులేనే నాయమ్మా. నా కడుపుచెడబుట్టారు నాఅమ్మా నాపాడుబతుకుకంటె సచ్చిందే మేలే అమ్మో

స్త్రీ:—నీకడుపున మంచివారొకరూ పుట్టలేదా?

సింగి:— ఇనతకు గెరటయ్యలాగ మానీడు నాకడుపునపుట్టాడేతల్లి. నానోము పండిందే అమ్మా. నాకడుపున రత్నంబుట్టిందే తల్లి. నత్తగుల్లలో నవరత్నం దొరికిందేతల్లి. చక్రంబట్టుకొని ఇష్ణుమూర్తిపుట్టాడే తల్లి. లోకంలో కలత సద్దుమనిపిస్తాడేతల్లి. కాలశక్రం తిప్పుతున్నాడే తల్లి. ఆయిన లోకానికంతా గురువేతల్లి.

స్త్రీ:—గురువై యేమి బోధిస్తారు.

సింగి:— సత్తెంగా సమ్మేలు గట్టమన్నాడె అమ్మా.

స్త్రీ:— అంటే వివరంగా చెప్పు.

సింగి:— ఇంసతేకుండా సమ్మెలు గట్టమన్నాడె తల్లి. అన్నేలానికి అడ్డుపెట్ట వద్దన్నాడె అమ్మా. ఒకచెంపగొడితే రెండోసెంపియ్యమన్నాడే తల్లీ. కట్టుపంచ దొంగిలిస్తే పై పంచ చదివిస్తాడే అమ్మా. రొట్టె దొంగకు నెయ్యిస్తాడే అమ్మా. పాణంతియ్యడంకంటె తన పాణమియ్యడమే మే లన్నాడోయమ్మా. బానిసబతుకు బతకొద్దన్నాడోయమ్మా. అసత్తేనికి బయపడవద్దన్నాడె తల్లీ. కీడుకు మేలే కీలంటాడె అమ్మా.

స్త్రీ:—ఎప్పుడిదంతా జరిగేది?

సిం:—అదుగదుగోనని ఆత్రపడుతుండాడె తల్లీ.
యెనకాముందూ సూడొద్దంటాడె తల్లి.
లోకమంతా యెలిగిపోతాడె తల్లీ.
బూమాకాశం బోరుకొంటడె మాఅమ్మా
వేడిలేనిదే ఎలిగిస్తాడె మాఅమ్మా
ఆకాశమంతా అల్లుకుంటడె మాఅమ్మా
అష్టదిక్కులూ అల్లుకుంటడె మాతల్లీ
అందరుకూడా ఆవుతి అవుతారె మాతల్లి.

స్త్రీ:—ఆహుతయితే యేమిటి!

సింగి:—స్వర్గరాజ్యమె మనకొస్తాదే మాయమ్మా
అంతాదేవుళ్ళయిపోతారె మాయమ్మా
భూమిమీదనే దేవరాజ్యము పుట్టుకవస్తాది
నీనా భేదము లేనిరాజ్యమె నెలకొల్పుతడమ్మ
ప్రేమరాజ్యమే లోకమంతట పెంపు జేస్తడమ్మ
స్వపరరాజ్యముల భేదము లేని స్వర్గరాజ్యమమ్మ
తప్పుచట్టముల పాలన లేని ధర్మరాజ్యమ్మ
దేవదేవుడె రాజై అప్పుడు దేశమేలుతాడు
నీవూ నేనూ దేవుడిలోపల నిల్చిపోతమమ్మ
తల్లి నోరెండుతుండది కాస్త బువ్వబెట్టమ్మ.

స్త్రీ:—నాథనమంతా నీవుకూడా అనుభవించు.

సింగి:—నేనుమటుకు యేంజేసుకుంతనమ్మా.

---

సమాప్తము.



---

యింపీరియల్ ప్రింటింగ్ వర్క్సు; గుంటూరు.